## —నటవర్గం—

చంద్రమోహన్ - మోహన్‌బాబు - అల్లురామలింగయ్య

కాంతారావు, కుమార్జి, చక్రవర్తి, చలపతిరావు, ఆప్పారావు, శ్రీరాజ్, మోదుకూరి సత్యం, ధమ్, జగదీష్, జి.ఎస్. స్వామి జయసుధ, సుభాషిణి, బాలతార బేబిరేఖ, బేబిసుధ, మాస్టర్ ఆలీ జానకి, పార్వతి మొ॥వారు మరియు పటశేఖర సత్యనారాయణ

## సాంకేతిక నిపుణులు

కథ : సత్యానంద్, జంధ్యాల

మాటలు : సత్యానంద్

పాటలు : వేటూరి సుందరరామమూర్తి

సంగీతం : చక్రవర్తి

కెమెరా : కె. యస్. ప్రకాష్

పాడినవారు : పి. సుశీల, బాలసుబ్రమణ్యం, యస్.పి. శైలజ, పుష్పలత

కళ : మోహన

ఎడిటింగు : డి. వెంకటరత్నం

నృత్యము : సలీమ్

ప్రాసెసింగ్ : ప్రసాద్ ఫిలిమ్ లాబొరేటరీ

స్టూడియో : వాహినీ, సత్య

రికార్డింగు, రీ రికార్డింగు : యస్. పి. రామనాథన్

డైలాగ్ రికార్డింగ్ : యమ్. జి. రాజన్

ప్రొడక్షన్ మేనేజర్స్ : జి. మల్లికార్జునరావు, యన్. సత్యనారాయణ

స్టిల్స్ : జి. శ్యామ్‌కుమార్

మేకప్ : రమేష్, సురేష్, నారాయణ, సాంబయ్య

కాస్ట్యూమ్స్ : యమ్. కృష్ణ

ప్రొడక్షన్ కంట్రోలర్ : పి. చంద్రశేఖర్

పబ్లిసిటీ ఇన్‌చార్జి మోహన్‌కుమార్

పబ్లిసిటీ డిజైనర్ : గంగాధర్

పోస్టర్స్ ప్రింటింగు నేషనల్ లితో ప్రింటర్స్ (విజయవాడ)

పబ్లిసిటీ : శ్రీ పబ్లిసిటీస్ (విజయవాడ)

కథా సంగ్రహం

సీత ఆలిండియా రేడియోలో పనిచేస్తూ వుంటుంది. ఆమె చాల చురుకైన, తెలివిగల ఒక కొడుకును కలిగివుంటుంది. అతను ఎప్పుడూ తన తండ్రిగురించి ఆమెని విచిత్రమైన ప్రశ్నలతో వేధిస్తూ వుంటాడు. ఎప్పటికప్పుడు అతని తండ్రి విదేశాల్లో వున్నట్లు విషయాన్ని చెప్పి పుచ్చుతూ వుంటుంది. కాని దాని వెనుక వున్న విషాద నీడలు ఆ పిల్లాడికేం అర్థమవుతాయి ?

సీత తండ్రి తన ప్రియమైన భార్యను పోగొట్టుకుంటాడు. కాని సీత తన తండ్రిని ఎప్పటికప్పుడు - అతని భార్య - బ్రతికే వుందని నమ్మిస్తూ వుంటుంది. ఇదంతా ఆమె తండ్రి సంతోషాని కోసం ఆమె చేస్తున్న ప్రయత్నం అన్నమాట. దానికి తన తండ్రి మానసిక వ్యథ నుండి కొంత తెప్పరిల్లుతుంటాడు. శాతారావు అనబడే ఒక చురుకైన యువకుడు సీతా వాళ్ళ ఇంటివాళ్ళతో సంబంధాలతో మెలుగుతుంటాడు. మొదట అతను సీతనుయిష్టపడతాడు. పోనుపోను ఇష్టత కాస్త ప్రేమలోకి దిగుతుంది కానీ అతను తన ప్రేమను ఎన్నడూ వ్యక్తం చేయలేదు. ఆఖరికి అతను ట్రైనింగుకని వెళ్తున్నప్పుడుకూడా దాన్ని బయటపెట్టలేదు.

మోహన్, సీతా వాళ్ళ ఎదురింట్లోకి వస్తాడు. సీత తండ్రి పోయేటప్పటికి, సీతకి అతను ఒక్కడే ఆధారమవుతాడు. తరువాత వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటారు. శాతారావు ట్రైనింగునుంచి తిరిగి వచ్చి, మోహన్‌కి సీతకి పెళ్ళయిందని గ్రహిస్తాడు. శాతారావు సహాయంతో సీతకు ఆలిండియా రేడియోలో వుద్యోగం వస్తుంది.

కాలం సంతోషంగా సాగుతోంది సీతకు. ఒకరోజు సీతను శాతారావు డాక్టర్ దగ్గరకు తీసుకుపోగా ఆమె గర్భవతి అని తెలుస్తుంది. ఈ శుభవార్తను సంతోషంతో చెబుదామని వచ్చిన సీతకు మోహన్ ఒక వ్యభిచారితో కళ్ళబడటం చూసి జావగారిపోతుంది. సీత అతని మూర్ఖత్వమును ప్రశ్నిస్తుంది గర్భవతినని చెబుతుంది. మోహన్ ఆమె మంగళసూత్రాన్ని తెంపుతాడు. ఇదేమని సీత వాపోతే, నీ కడుపుకి తను ఒక్కడే అని ఏమిటి... ? అని సమాధానమిస్తాడు.

ఆలిండియా రేడియోలో పని చేసే సీత నిస్సారంగా తన కొడుకు గోపి కోసం బ్రతుకుతోంది. రాధ, సీత పక్కింటి ఆమె. సీతకు ఆమె

# — పాటలు —

పాట 1 రచన : వేటూరి

పాడినవారు : సుశీల, బాలసుబ్రహ్మణ్యం, శైలజ

చిన్నిచిన్ని చిలకల్లారా చిట్టిపొట్టి జింకల్లారా
మా నాన్న వచ్చిన రోజు మా అమ్మ నవ్విన రోజు
నాకిది పండుగరోజు వింత నూరేళ్ళ పండగరోజు
హాపీ డే, జాలీ డే – కమాన్ సింగ్ నాడ్ ..
గూట్లో పిల్లల కిచకిచలు గువ్వల జంటల గుసగుసలు
ఎందుకు మమ్మీ పిల్లల అల్లరి – ఏమిటి గువ్వల సందడి.
అమ్మా ఆకలి అన్నం పెట్టమనీ పిల్లలుచేసే అల్లరులు
తల్లీపిల్లలు ముద్దులతో అవి చల్లగ చేసిన సందడులు
అవునా డాడీ....
పిల్లల పిలుపుల కువకువలే కన్నవారికి వేణువులు –
ఆ పిల్లల అల్లరి కిలకిలలే మళ్ళీ చూడని వెన్నెలలు
యస్ డాడీ యువార్ రైట్....
కొమ్మల రెమ్మల పువ్వులలో తుమ్మెద పాటలు చెప్పమనే
ఎందుకు మమ్మీ తుమ్మెద అల్లరి ఏమిటి కొమ్మల సందడి
అమ్మా తీయగా జోల పాడమని తుమ్మెద తీసేరాగాలు
కొమ్మరెమ్మలకు చెవిలో అవి పువ్వులలాలిపాటలు
అవునా డాడీ –
తెలిసీ తెలియని పువ్వులలో కొన్ని మాత్రమే తుమ్మెదవి
ఆ విరిసీ విరియని నవ్వులలో కొన్ని పువ్వులా దేవుడవి –
యస్ డాడీ యస్ యువార్ రైట్

పాట 2 రచన : వేటూరి

పాడినవారు : యస్. పి. శైలజ

కృష్ణా.........కృష్ణా.........
కొండంత దేవుడవు నీవు – గోరంత దీపాన్ని నేను
దీపాలకు దీపమే నీవు .. అందుకే నా దైవమైనావు
నిన్ను చూడాలని కన్నులే చూపులై చూడలేక కన్నీటి చుక్కలై

కోతలు కొయ్యొద్దు నీ గొప్పలు చెప్పొద్దు –
తలచే తమ్మను వెంటనే తెమ్మను –
చంద్రుణ్ణి పొద్దు

పల్లవి: ఓ చందమామా మా మేనమామా –
ఇలవంక దిగిరారా నెలవంతమామా
నీలో వున్నది మేమే అన్నది నిజమే అయితే దిగిరా –
వెన్నెల వెలుగులు కురిపించు .. చీకటి కళ్ళను తెరిపించు –
నీవున్నావని నిరూపించు –

పాట 8

రచన : వేటూరి
పాడినవారు : శైలజ, పుష్పలత

వినరయ్యా యీ రామకథా –
సీతారాముల ప్రేమకథా –
తండ్రిమాట పాలించంగా
రాముడు అడవికి చేరంగా
సీత లేడిని కోరంగా
రాముడు వేటకు వెడలంగా –
భవతి భిక్షాందేహి భవతీ భిక్షాందేహి –
లక్ష్మణ రేఖ యిది స్వామీ రక్షణరేఖ యిది
రక్షదాటినే భిక్షను వేయను ఆర్యుల ఆజ్ఞ ఇది. స్వామీ
షట్కాలల శివపూజా నిరతుడ –
త్రికాలల అనవద్య చరిత్రుడ –
అతి పవిత్రుడను – అపవిత్రుడను –
అతిథి సన్మతివా కులసతివా.... ఆయ్ –
అయితే తక్షణ లక్ష్మణరేఖ అతిక్రమణమే నీ ధర్మం –
భవతీ భిక్షాందేహి స్వామీ –
పతివ్రత తల్లిని సీతా సాధ్విని
పతిత రావణుడు అపహరించగా –
సీతను బాసిన రామచంద్రుడు వియోగమున విలపించగా

